# Chatura Chandrahasam

A Drama in Five Acts.

BY

Chilakamarty Lakshmi Narasimham

AUTHOR OF

Prasannayadavamu, Soundaryatilaka and

Karpuramanjary .etc. etc.



3000 COPIES

Mattai Subba Row

ıblisher and General Merchant,

Rajahmundry.

1922.

 —— Price 0-8-0

శ్రీ

# చతురచంద్రహాసము.

అయిదంకముల నాటకము.

ఇది

చిలకమర్తి లక్ష్మీనరసింహముగారిచే

రచియింపఁబడి.



## ఈ నాటకమున వచ్చు పాత్రలు.

హేమవర్మ — కుంతలదేశపు రాజు

భాగురాయణుడు — కుంతలదేశపు మంత్రి — (ఇతనికే దుష్టబుద్ధి యని పేరు)

ఉగ్రసేనుడు — కుంతలదేశపు సేనాని

జయంతుడు — మాళవదేశపు రాజుచే బాధబడిన బ్రాహ్మణుడు

సుమంతుడు — పుళిందదేశపు మంత్రి

మదనుడు — భాగురాయణుని కొడుకు

ఇంద్రదత్తుడు — పుళిందదేశాధిపతి

చంద్రహాసుడు — పుళిందాధిపునకు పెంపుడుపుత్రుడు — ప్రధాననాయకుడు

మండనుడు } భాగురాయణుని సేవకులు
శౌనకుడు }

చారాయణుడు — చంద్రహాసుని కంచుకి

భీముడు } కుంతలపురములోని కాళికాలయరక్షకులు
ఘోరవృకుడు }

గాలవుడు — కుంతలేశ్వరుని పురోహితుడు

### స్త్రీలు.

విషయ — భాగురాయణుని కూతురు — కథానాయిక

కాంచనమాల — విషయ చెలికత్తె

ఇంకను కంచుకి, సేవకులు, పౌరులు మున్నగువారు వచ్చెదరు.

# చతురచంద్రహాసము. 

## నాంది.

మ. కనులం జూడక యున్న సెవ్వని శుభాకారంబు, సెవ్వాని చే
తన కేలన్ స్పృశియింపకున్న, వినకున్న న్వీనులం బోల్చి సె
వ్వని కంఠధ్వని, విశ్వముం గన నవిగ్రాహ్యం బెందు నున్న వాఁ
డని తోఁచున్నది, దానినెం దొరకఁడేఁ దానేల్పు మామ్మౌళితన్.

వెండియు,

తే. గీ. విబుధకోటికి ప్రశ్నయు విషయ మగుచు
నమిత మోహాలతా చంద్రహాస మగుచు
భువన నిర్మితి నిర్దిష్ట బుద్ధి యగుచుఁ
గాంచు నా పరవస్తువు గాచుమిమ్ము. 2

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి సభకంకఁ జూచి)

సూత్ర—

మ. కలనే ప్రశ్నము, శాస్త్రమే నకేము, విజ్ఞానంబె కార్యంబు గా,
వల దజ్ఞానవిరోధి మండలము చేకం దాఁకె తూలించి ని
శ్చల ధర్మంబులు ధాత్రినిల్పు కవితాసామ్రాజ్య పట్టాభిషి
క్తుల, విద్వన్నృపులం దృణీకృతసుకాశ్రేణీంద్రులం గొల్చెదన్. 2

(అని పుష్పాంజలిఁ జల్లి, తెరకంకఁ జూచి)

సూత్ర—మారిషా! నీవొకసారి యిటు రమ్ము.

పారిపార్శ్వకుఁడు—(ప్రవేశించి) బావా! నా కిప్పుడేమి నియోగము?

సూత్ర—ఏమి నియోగ మని యడుగుచున్నావా? ఈరాత్రి మన విహారంగస్థలమున నొక రూపకప్రయోగముఁ జేయఁ దలఁచినమాట మఱచితివా?

పారి—మఱవలేదు. రంగస్థలమున నంతయు సిద్ధముగ నున్నది. కాని బావా! నీ వాగ్రహింపకుందువేని చిరకాలమునుండి నా మనంబును పీడించుచున్న యొక సంశయమును నిన్నడిగి తీర్చుకొనవలయు నని యున్నది.

సూత్ర—ఓ భీరుఁడా! ఆగ్రహముతోఁ బని యేమి? సంశయ మెఱిఁగింపుము.

వైదికబ్రాహ్మణుఁడు, ఋగ్వేది, యాశ్వలాయనసూత్రుఁడు, కాశ్యపగోత్రుఁడు, చిలకమర్తికులజుండు, పేరయార్యపౌత్రుండు, నర్సమసాధ్వికి వెంకన్నశర్మకుఁ బుత్రుండు, పురాణపండ భద్రయార్యదౌహిత్రుండు, మల్లయమనీషిశిఖామణి మేనల్లుండు, సకల విద్వజ్జన విధేయుండు నగు లక్ష్మీనృసింహభట్టారకునిచే నభినవముగా విరచింపఁబడిన చతురచంద్రహాసనాటకమును బ్రయోగింపఁ దలఁచుకొన్నారము.

పారి—ఓహో! ప్రచండయాదవము, ప్రసన్నయాదవము, మొదలగు బహునాటకంబుల రచియించిన కవి కాఁడా యాతఁడు?

సూత్ర—అవును వాఁడే.

పారి—అయ్యా! పుంభావసరస్వతు లని చెప్పఁదగిన కాళిదాస, భవభూతి ప్రముఖ ప్రాచీన విద్వత్కవీంద్రులు రచియించిన రసవంతము లగు మహానాటకము లీనాఁటి యాంధ్రకవులచే నాంధ్రీకరింపఁబడి యుండఁగా, వానియం దేదే నొక్కటి ప్రయోగింపక మీ రీకవి నిర్మితమైన యభినవరూపకమునే యాడఁదలఁచుటకుఁ గారణ మేమి?

సూత్ర—మారిషా! నీ ప్రశ్నమున కుత్తరము లేకపోలేదు.

తే. గీ. కాళిదాసాది గీర్వాణకవులు దృశ్య
కావ్యములఁ దొల్లి స్వకపోలకల్పితముగ
నల్లి రేకాని యనువాద మనుసరించి
వారు భాషాంతరమ్ములు సలిపిరయ్య. 1

పారి—ఆమహాకవులట్లే యీనాఁటి కవులును స్వకపోలకల్పితముగ దృశ్యప్రబంధములు నిర్మించియున్నారనియా నీ వనుచున్నావు? వాడిపూవునకుఁ గన్నెపూవునకు భేదముండదా? ఈనాఁటివా రెట్లో యవస్థలఁబడి గ్రంథముల వ్రాసి రనుము. సనాతనకవికృతులయందలి సందర్భశుద్ధి, కల్పనాచమత్కృతి, శబ్దసౌష్ఠవము మున్నగు నుత్తమగుణము లధునాతనప్రబంధముల నుండునా?

సూత్ర—ఉండవచ్చు, మానవచ్చు, దాని కేమి. ప్రస్తుత మీవిషయము సిద్ధాంతీకరించుటకు తేవనియు నొప్పుకొందును. అయినను లోకమున కీర్తిగ్రంథములుంగూడ నుండవలయు, ఎట్లన్న:

తే. గీ. అధిక మతిమంతు లాకృతు లధిగమింత్రు
అల్పమేధావు లీకృతు లాదరింత్రు

అంటుమామిళ్ళు ధనవంతు లారగింప
జీడిమామిళ్లు పేద భక్షించుఁగాదె. 3

పారి— సరే. నీ వాదము నే నొప్పుకొంటి. అప్రస్తుతవిషయాసముద్రంబునం బడి మన మిఁకపురముం గొట్టుకొనిపోవుచుఁ బ్రకృతమును విడుచుచున్నాము. చతురచంద్రహాస రూపకమువలన లోకమునకు వెల్లడి యగునీతులు ధర్మములు వినఁగోరుచున్నాఁడను.

సూత్ర— ఈకథార్ణవమునం దట్టినీతిరత్నము లనేకములు గలవు. చూడు.

శా. స్వామిద్రోహము లోఁ దలంచుకొని యీర్ష్యాదుర్గ్రహావిష్టుఁడై,
నేమంగ బేమియులేక కోరికలకు, న్నింద్యక్రియారంభుఁడై
వ్యామోహంబున సాధులం జెఱుపగా యత్నించు క్రూరుం, డెదన్
బాము ల్వొందుచు దుష్టబుద్ధి పగిది న్నాశంబు నొందుం దుదన్. 9

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

ఇతి ప్రస్తావన.

---



# చతురచంద్రహాసము

## ప్రథమాంకము.

---

### కుంతలపురము — మంత్రిమందిరము.

[అప్పుడు మంత్రి ప్రవేశించుచున్నాఁడు.]

మంత్రి—(తనలో) రాజోపజీవులలో మంత్రియే సర్వోత్కృష్టుఁడు. ఏలయన-

తే. గీ. మకుట మూడల నిడఁడన్న మాటె కాని
కనకసింహాసనము నెక్కఁ డనుటె కాని
సచివుఁడే యేలుచుండును క్ష్మాతలంబు
రాజు గుడిలోని మూల విరాట్టువోలు. 1

మఱి మంత్రులో, యర్చకులట్లు కోట లనియెడి కోవెలలందు నరదేవులను మంత్రతంత్ర బలంబుల బంధించి, కాలోచితముగఁ గార్యనివేదనము చేయుచు, నిత్యోత్సవంబులు, సర్వోపభోగంబులు, కైంకర్యంబులు యథాసమయముగ నెఱపుచుఁ దత్ప్రసాదంబులు స్వీకరించి, సకలైశ్వర్యంబులు వానితో సమానముగఁ దారు ననుభవించుచుందురు. ఇట్లు భావించుటకుఁ గారణ మేమన, రాజు.

తే. గీ. సోగకన్దోయి గల్గియుఁ జూడలేడు
చెవిడ వీనులు గల్గియు విన్నఁగ లేడు
చేతులుండియు నొకపని చేయలేడు
పలుక నేర్చియు స్వేచ్ఛమై పలుకలేడు. 2

వెండియు, నాత్మగౌరవగోపనంబు నెపంబున,

చ. ధరణివిభుండు భూప్రజకు దర్శనమేయిడఁ జాలకింపఁడే
మెఱి, నిజకార్యనిశ్చయము మోపు నమాత్యుని మీఁద, మంత్రియే
నరపతికన్ను, వాఁడె జననాథునకుం జెవి, వాఁడె ధారుణీ
శ్వరుని భుజంబు, వాఁడె క్షితిపాలు శిరస్సు, మనస్సు నాతఁడే. 3

ఇంత మహాధికారము చేతనున్న దని యమాత్యుఁడు సైతము గర్వింపవలసినపని లేదు. ఏలయన, సేవకుఁ డెప్పటికిని సేవకుఁడే. నృపాల మేఘంబులు కరుణాపాంగ విలోకన వర్షంబు లెప్పుడు కురియ నప్పుడె మంత్రుల యధికారసస్యంబు జీవనరహితమై మాడి పోవు. వేయేల,

తే. గీ. సిరులఁ దుల తూఁగుచుండియు సేవకుండు
నృపుని చిట్టల్కకగ్గమై నిలుచు గానిఁ
జెడును బూవులఁ గాయలఁ జెలఁగుచుండి
పిడుగుపాటున దగ్ధమౌ వృక్షమట్లు. 4

పూర్వపుణ్యవశమున నే నింతవఱకు రాజానుగ్రహంబునకుఁ బాత్రుఁడనై నా శాసనంబె యాతని శాసనంబుగ, నామాట వాని మాటగ, మెలంగుచుంటి. ఎట్లు మెలఁగినను నేను సేవకుఁడనే గదా! ఆనృపుని కనుసన్నల మెలఁగఁదలసినవాఁడనే గదా! వాని గీచినగీటు దాటఁగూడనివాఁడనే కదా! హా! యెంతకష్టము. నిరంకుశ చింతశాసనుండనై, యత్యంతిత ప్రజ్ఞానిలయుండనై, భార్గవాంగిరస నీతికోవిదుండనై, నిరుపమాన మనీషా బలసంపన్నుండనై, దిగంతవిశ్రాంతకీర్తినైన నేను చపలుండు, దుర్విదగ్ధుండు నగు నీరాజున కనుజీవుఁడనై బ్రతుకవలసివచ్చెఁ గదా. దీని కేమి? ఇంతకన్నను విశేష మనోవేదనకుం గారణము వేఱొండు గలదు.

మ. జనపాలాగ్రణి దివ్యనంబుఁ గదియంగా సామంత భూపాలకుల్
ధనముల్ కాన్కలు కప్పము ల్గొనుచు రాఁ దత్సన్నిధి న్నేభయం
బునఁ జేదోయి మొగిడ్చి పేదలగు చూపు ల్చూచుచున్నిల్తుఁ గొ
ల్వున, నానైచ్యమె చాలు నాదు హృదయంబు న్గాల్పఁ జిచ్చుంబలెన్. 5

కావున నిప్పటియట్లు పేరునకు మాత్రమె కాక సర్వవిధంబులఁ బ్రయత్నించి యీకుంతల దేశంబునకు నేను నిక్కమగు రాజుం గావలయు.

ఆ. వె. నా మనోరథంబు నవరత్న మకుటంబు
నా చిరాభిలాష రాచటీకము
నాదు గమ్యభూమి నరనాయకునిగద్దె
నాకు మోక్షపదము లోకజయము.

మ. అతఁడే ధన్యుఁ డతండె పూరుషుఁడు పుణ్యాత్ముం డతండే యనం
జెలి నెవ్వాఁడు కిరీటము న్దలపై, సింహాసనం బెక్కి, త
చ్చతురంభోనిధి మేఖలావలయిత క్ష్మామండలీపాలనా
కులభాగ్యస్ఫురితుఁడై ప్రఫుల్లోజ్జ్వల హర్షాంభోధి నోలాడునో.

అంత యదృష్టము నాకు లభించునే ? నాకుటుంబము కుంతలరాజకుటుంబ మగునే ? వందులు కైవారములు సేయ, మాగధులు వంశకీర్తనలు సలుప, వైతాళికులు కాల్యకృత్యములు విజ్ఞాపింప, ప్రగ్గడలు రాజకార్యములు నివేదింప, రాయబారులు వినయమున సందేశము లెఱిఁగింప, శ్రీమంతు లగుసామంతులు పాదాక్రాంతులై కొలువ, వేత్రహస్తులు సాహోనినాదములతోఁ బరాకులు తెలుప, రెండవ యాఖండలుండునుంబోలె పసిండిగద్దియ నెక్కి నిండుకొలువుండు భాగ్యము నాకుఁగాని నాకుమారుఁ డగుమదనునకుఁగాని పట్టునే ? ఏల పట్టక యుండును ? కార్యములు ప్రయత్నసాధ్యములు.

తే. గీ. పురుషకారంబె చెలి ఫలంబులకు నెల్ల
పురుషకారంబె సిద్ధికి మొదటిమెట్టు
పురుషకారంబె దైవంబు భూతలమునఁ
బురుషకారంబె కల్పించుఁ బూర్ణజయము. 8

పురుషకారంబునందు దృఢవిశ్వాసముఁ గలవాఁడనగుటచేఁ గాదె పదునాలుగేండ్లక్రిందట జ్యోతిషులు దిక్కుమాలిన యొక చక్కని కుఱ్ఱనిఁ గాంచి యతఁడు చక్రవర్తిలక్షణలక్షితుఁ డనియుఁ, దప్పక కుంతలంబున కధీశ్వరుఁ డగుననియుఁ జెప్ప నే నది సహింపక నామార్గంబు నిష్కంటకము గావింపఁ దలంచి వధహంతకులఁ బిలిచి యా బుడుతనికి నాఁటిరాత్రియే యమలోకవాససౌఖ్య మిప్పించితిని. నాఁటంగోలె నే నీవ్యవసాయంబునఁ దగిలియుంటి. అదను నిమిత్తము వేచియుంటి. ఇంకఁ బ్రతీక్షించినఁ గార్యము లేదు. రాజ్యమెట్లయిన గ్రహింపవలయు. ఏమి యుపాయము ?

ఉ. చంపుదునా నృపాలకునిఁ ? జంపితినా ప్రజ సైపదీపనిన్
జంపకయున్న రాజ్యరమ నా వశవర్తిని యౌట యెట్లు ? ఆఁ!
చంపకగంధి యున్నయది చంపకనామక రాజపుత్రి. నే
పెంపెసలార నయ్యువిదఁ బెండిలి సేయుదు నాదుపట్టికిన్. 9

రాజునకుఁ బుత్రసంతానము లేమింజేసి యాభూపాలుని పరోక్షమున నాపుత్రుఁడు కుంతలంబునకు రాజగును. కాని, రాజు చంపకను నా కుమారున కిచ్చి వివాహము సేయునా ? దానికిం దగిన యుక్తులు నే పన్నఁజాలనా ? జయంత సదృశుఁ డగు నా కుమారునికన్న మంచి యల్లుఁ డీరాజునకు లభించునా ?

[అప్పుడు కంచుకి ప్రవేశించుచున్నాఁడు.]

కంచు—దేవా ! మాళవేంద్రుని పురోహితుఁ డగుజయంతుఁడు మీ దర్శనమును గోరుచున్నాఁడు.

మంత్రి—యువరాజు పరిపాలనమున దేశ మెట్లున్నది ?

సుమం—ఇట్లున్నది—

ఆ. వె. నడుచు ధర్మ మిప్పుడు నాల్గుపాదములను
గాటకములు పూర్వకాల కథలు
జారచోర భీతి శబ్దావశేషంబు
స్వప్నగతము లీతిబాధ లచట. 17

దేవా ! నేఁడేల ? చంద్రహాసుఁడు జనులచే నిట్లు పరిగణింపఁ బడుచున్నాఁడు.

తే. గీ. అలుకనయందు సత్త్వసన శూలపాణి
సాధురక్షణ రెండవ చక్రపాణి
వైభవమ్మున మానవ వజ్రపాణి
ధర్మపరత మధ్యమలోక దండపాణి. 18

మంత్రి—(తనలో) అబ్బా ! ఈస్తోత్రము వినఁజాలకున్నాఁడను. ఈతని పలుకులు సూదు లట్లు నాకుఁ గర్ణకఠోరము లగుచున్నవి. ఇతని నింకఁ బంపివేయవలయును (అని ప్రకాశముగా) సుమంతా ! [illegible] ద్వారను నేను సందేశ మంపుచున్నాను. తన పుత్రిని ప్రజ్ఞావిశేషమునకు నేనును మహానందభరితుఁడ నైతి ననుము. అచిరకాలమున వచ్చి తన యానందమున సగబాలు పంచుకొని యనుభవింతు ననుము. నీ వింకఁ జనుము.

సుమం—మహాప్రసాదము. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

మంత్రి—(తనలో) ఏమీ ? ఆకుమారుఁ డర్ధరాత్రమున నరణ్యమున లభించెనా ? నాలుగైదేండ్లవయసా ? ఆఱవ్రేలు నఱకఁబడి యుండెనా ? కథలను బోలినకథలు లోకమున నుండవచ్చును గాని యిన్ని సామాన్యలక్షణము లుండుట యరుదు. నేను తొల్లి ఘాతుకులచేతి కిచ్చి చంపఁబంపిన డింభకుఁడునూడ నాలుగైదేండ్ల యీడువాఁడగుట చేతను, నృశంసకులు వాని నర్ధరాత్రమున నరణ్యమునకుఁ గొంపోవుటచేతను, బాలకుం డెగటార్చినందున కానవాలుగ ఘాతుకు లొకచిన్నవ్రేలు దెచ్చి నాకుఁ జూపుటచేతను ఖండితాంగుళి కానఁబడెనే దని సుమంతుఁడు పలుకుటచేతను, మఱియుతని రూపరేఖా విలాసంబులం బరికించి నా జ్యోతిషికుఁ డెట్లు పలికెనో చంద్రహాసుని కాంతిశాలుఁగూడ నట్టే వచియించుటచేతను, సర్వవిధముల వాఁడు వీఁ డయి యుండవచ్చునని తోఁచుచున్నది. నీతిబాహ్యు లగుహంతకులచేత నేను వంచింపఁబడి యుండవచ్చును.

తే. గీ. నాలుగు వరాల లంచంబు నాకడఁ దిని
పేఁయు పసిబిడ్డ. కుత్తుకఁ గోయఁదలఁచు

హేమ—సత్వరము ప్రవేశపెట్టుము.

కంచు—చిత్తము. (అని నిష్క్రమింప మంత్రి ప్రవేశించును.)

మంత్రి—జయము జయము మహారాజా! (అని శిరమువంచి కూర్చుండును.)

హేమ—భాగురాయణా! ఆహితాగ్ని యగునీమహాత్ముఁడు కాశ్మీరరాజపురోహితుఁడు దేవశర్మ. అన్నకుమారుఁ డగు సింహదేవునకు మన చంపకమాలిని నిమ్మని యడుగ వచ్చె.

మంత్రి—(తనలో) ఆహా! మరల నొక గడ్డుపని వచ్చినదిగదా. వచ్చిన నేమి? ఈయంతరాయము లెల్ల నాబుద్ధిసువర్ణము మేలిమిఁ జూపుటకగు గీటురాళ్లు. (ప్రకాశముగా) కుంతల కాశ్మీరక కుటుంబముల కలయిక నాకుఁ బరమసంతోషము. ఉభయ జాతకములఁ జూచి ముహూర్తము నేర్పఱచి వెనుకనుండి పంపవచ్చును.

హేమ—అవును. బ్రాహ్మణోత్తమా! సింహదేవుని జాతకము, వాని చిత్తరువు నాకిచ్చి మీరు విజయము చేయుఁడు.

దేవ—చిత్తము. ఇదె జాతకము. ఇదె చిత్తరువు. ఇంక నే సెలవందెద. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

మంత్రి—(తనలో) మంత్రశక్తిచేత గుటికొని సింహాసనము నెవఁడు నడపెదని. (ప్రకాశముగా) దేవా! జాతకమును జూడనిండు.

హేమ—జ్యోతిషమునందు నీకుఁ బలె నాకుఁ బ్రవేశము లేదు. ఇది నీవు చూడఁదగినది. (అని యిచ్చును.)

మంత్రి—(చూచుట నభినయించి) మహారాజా! మన మిగుల నదృష్టవంతులము. జాతకముం జూడక వివాహము నిశ్చయించినచోఁ బెద్ద ప్రమాదము సంభవించియుండును.

హేమ—(ఆశ్చర్యముతో) ఏమిప్రమాదము జరిగియుండును? జాతక మెట్లున్నది?

మంత్రి—ఏమని మనవి చేయుదును! చెప్ప నోరు రాకున్నది. అయినను రాజభక్తి యీరహస్యమును నాహృదయమున దాఁగనీయదు. సింహదేవుని జాతకమున జాయాస్థానమునఁ గ్రూరగ్రహ మున్నది. అందుచే నతఁ డల్పాయుష్మంతుఁడు.

హేమ—భాగురాయణా! చాలు. కాశ్మీరరాజసంబంధము చాలు. ఇఁక నా ప్రసంగము తలపెట్టకుము.

తే. గీ. దెసలు వెలిఁగింపఁ గల మహాతేజమున్న
నొంప నలవి కాని మహాప్రతాపమున్న

నాయావు కొంతవడు లేని వతేఁడు వోవుఁ
జమురులేని దీపమువోలె సత్వరంబ. 22

మంత్రి—(తనలో) జ్యోతిశ్శాస్త్రమా ! నీ వడ్డుపడి నాయాపద నివృత్తికి గడవం బెట్టితివి. (ప్రకాశముగా) దేవా ! ఈ ముదిమిలో బాలికావివాహవిషయికమైన చింత మీరు మనంబున నుంచుకొనరాదు. ఎట్టివాఁడు కావలయునో తెలిపి సంబంధనిశ్చయభారము నా తలపై మోపుఁడు.

హేము—అమాత్యా ! ఇదిగోఁ జెప్పుచున్నాఁడ.

ఉ. అల్లునిఁ జెప్పు నా కొకని యందమునం జంద్రమామ చే
నల్లుని గేలువాని, బల మారసిచూడ విదేహరాజు పె
ద్దల్లునిఁ బోలువానిని, మహారసికత్వమునందుఁ గంసు చి
న్నల్లుని మీఱువాని, సిరి కంబుధి యల్లునిఁ గేరువానినిన్. 23

మంత్రి—చిత్తము. (అని తనలో) ఈ లక్షణములన్నియు దాదాపుగ మా మత నునియందుఁ గన్పట్టుచున్నవి గదా.

హేము—ఇది నీ వతిశీఘ్రముగఁ జేయవలయు. ఇట్లు నేను తొందరపడుటకు రెండు కారణములు కలవు. బాలిక వివాహయోగ్యయగు వయసుం బ్రాపించినది. వసుంధరాపరిపాలనక్లేశ మీ ముదిమిని ముసపటికన్న దుస్సహముగ నున్నది. ఇది నీ వెఱుంగనిది కాదు.

ఉ. మిడుతలదండు వచ్చిపడి మేయునొ పంటల, శత్రుసైన్యముల్
విడిసినవో యగీప, నతివృష్టులు ముంచునొ నేల, క్షామ మే
ర్పడినదియో గాఁ బ్రజం దుడిచిపెట్టునొ యంచుఁ గిరీటధారణం
బిడుపక సేయ మూర్ఖుఁడు సుఖింపక వ్యాకుల భాజనంబగున్ 24

అటులున్నను,

చ. చిరముగ నేలినాఁడ మహి సింగపు గద్దియ నెక్కి, ధారుణీ
శ్వరులరిగాఁపులై కొలువ, సౌఖ్యములన్నియుఁ బొందినాఁడ, నీ
చరమదశ న్దపోవనులఁ జక్రిపదాంబుజచింతనంబునన్
జరుపఁ దలంచినాఁడ దివసంబుల నల్లునికిచ్చి రాజ్యమున్. 25

అందుచేతఁ బుత్రసంతానహీనుండనగు నాకు హిమవంతునకుఁ జంద్రశేఖరుఁడు, క్షీరసాగరునకుఁ బురుషోత్తముండును లభియించినట్లు యిల్లఱికముండు నల్లుఁడు కావలయును. పుత్రసంతానవంతు లెంతయదృష్టవంతులో కదా.

తే. గీ. ప్రాణపదమైన సక్కటా ! యాఁడపిల్ల
పిలిచి యొక్కయ్యచేతిలోఁ బెట్టఁదగిన
యొకవుసాష్టమాటచేత నా కిపుడు మదినిఁ
గానయ్యెడుఁ గొడుకులు లేని వెలితి. 26

మంత్రి—దేవా ! చంపకమాలినికి మదనునిఁ దెచ్చి కూర్చుమన్నఁ గూర్చి నీమనోరథసిద్ధిఁ జేయుదు. అనపత్యులు విచారింపవలయునుగాని యేదో సంతానమున్నవారు పుత్రులు లేరని చింతించుట యుచితము కాదు. మీకుఁ గొడుకైనఁ, గూఁతురైనఁ జంపకమాలినియే. అదియునుగాక కడుపునంబుట్టిన బిడ్డలు స్త్రీలైనఁ బురుషులైన సమానులే.

తే. గీ. కూఁతు రుదయించి తెచ్చెడు కొఱఁత యేమి
కొడుకు జనియింపఁ గల్గెడు గొప్ప యేమి
యుభయులుం గన్నబిడ్డలే. యుదధిఁ బుట్టు
మౌక్తికము, వజ్రము సమూల్యములు కావె. 27

హేమ—పుత్రులు వంశపారంపర్యమును నిల్పి, నరకత్రాతలై సద్గతులు గల్గింతురు.

మంత్రి—ఆవిషయముల దౌహిత్రులు పుత్రతుల్యులు. (తనలో) రాజపుత్రికా వివాహప్రసంగమున శ్లేషోక్తిగ మా మదనునిమాట సూచించితినిగదా. వార్ధకముచే దుర్బలమయిన యీయనమనస్సును క్రమమున మదనున కనుకూలముగాఁ ద్రిప్పెద.

[ఒక కంచుకి ప్రవేశించును.]

కంచు—(రాజుతో) దేవా ! సుమంతుఁడు చందనావతికి దిగిపోవుట కనుజ్ఞ వేఁడుచున్నాఁడు.

హేమ—పోవచ్చును. అంపిన కానుకల నానందముతో నందుకొంటినని పుళిందునితోఁ జెప్పుమనుము.

కంచు—చిత్తము. (అని నిష్క్రమించును.)

మంత్రి—(తనలో) పుళిందునిప్రసంగ మెత్తి, నాసంకల్పము కొనసాగించుట కిదియే సమయము. (అని ప్రకాశముగా) దేవా! చిత్తగించితిరిగదా, పుళిందుఁడు పంపిన వెలలేని కానుకలను.

హేమ—కానుకలకేమి కాని, మన్నెదొరలం గెలిచి యాతఁడు నాకుపకారముఁ జేసెను.

మంత్రి—ఈ విజయమును, మితిలేని యానందమునుఁ జూడ మనమే సామంతు

లము, పుళిందుఁడే సార్వభౌముఁడుగా మాతినట్లు కనఁబడుచున్నది. మీకేగాక, నాకుఁ గూడఁ గొన్ని యమూల్యాభరణముల నులుపా పంపెను. మనకంపిన ధనసంచయంబులే యింత మితిమీతియుండఁ దాను దాఁచుకొనిన యగ్రరాసు లెంతగానుండునో, ఇంతకు నూఱుమడుంగులైన నుండవచ్చు. పుళిందుఁ డేఁటేఁట, మన కీయవలసిన కప్పము సరిగా నీయలేక యప్పులు చేసి, యెడనెడ నంతఃపురాంగనల నగలు కుదువఁబెట్టి నానాబాధలు పడుచుండువాఁడు. ఇప్పుడు నోరులేని మన్నెమూఁకల దోఁచుకొని తేరగాఁదెచ్చిన సొమ్ము గుటుంజేసి కావళ్ళతో దేవరవారికిని, మీబంటునకు నాకును గట్నములఁ బంపె. విక్రమము పేరుపెట్టి సలిపిన యీ బందిపోటునకు దేవరవారు తన్ను దండింతురను భయమున మిమ్ము నన్నును బ్రసన్నులఁ జేసికొనుటకై కన్ను చెదరిపోవునట్లు ధనరాసు లంపె. ఇవి మనకన్నులఁ గప్పుటకిచ్చిన లంచములుగాని కాన్కలు కావని నేఁ దలంచెద. అట్లై కాకున్న,

శా. నానాఁటి న్నృపు లప్పనంబులనుప న్నాకంటె టు నేఁ జూడ నే
నెన్నాఁడైన నృపుం డెవండయిన మున్నీకీతిఁ గావళ్ళతో
నానారత్నము లంపఁగాఁ గలిగెనే, నా మాటటుండంగనిఁ
డేనాఁడైనను గంటిరె కనులతో నిట్టింత మీ రేనియున్. 28

అన్నపాలుని దివాణంబున మాణిక్యంబులు మణిబొగ్గులట్లు, రవ్వలు గవ్వలట్లు, కెంపులు పెంకులట్లు వ్యవహరింపఁ బడుచున్నవని తోఁచుచున్నది.

తే. గీ. ఎన్ని ప్రాణము లీడ్చెనో, యెన్ని యిండ్లు
కూలఁద్రోసెనో, యెన్నాళ్ళు కొల్లఁగొనెనొ
ఎన్ని వంశము లార్పెనొ యీతఁ డకట !
ఎన్ని సేయని యీ సిరి యిట్లు గాంచు. 29

పాప మనాగరికులైన యా కొండకాఁపు లెంత చిత్తక్షోభము నొందిరో, దిక్కుమాలి యెంత విలపించిరో, యెవ్వఁ డెఱుఁగును. సార్వభౌములయిన దేవరవా రుపేక్షింప వారు పిల్లికిం జిక్కిన చిలుకలభాతి పుళిందుని దురాశాత్మునకుఁ గబళంబులైరి. అన్యాయార్జితములయిన యీ ధనములను నానందముతో నందుకొంటినని పుళిందునకు సుమంతుని ముఖమున మీరంపిన సందేశము నా కెంతయుఁ గష్టముగ నున్నది. ఇందుకు దేవర నన్ను క్షమించుఁగాక.

తే. గీ. మనకు నంపిన యీ మణుల్ మణులు గావు
బోయదొరల క్రొన్నెత్తురుబొట్లు గాని

సముతసుఁబంపు బంగారు నాణెములును
నాణెములుగావు ప్రజల ప్రాణములుగాని. 30

మఱియు,

క. ఈ ధనములు నరకమునకు
సాధనములు కైటభారి చరణాబ్జయుగా
రాధనములు గావించెడు
సాధులు మనవారింట్లు ముట్టఁజన దీధనముల్. 31

కావునఁ బుళిందుఁడు సుమంతునిచేతఁ బంపిన మణిహారాద్యుపాయనంబుల నేను దాల్పను. దేవరవారి ధనాగారమునఁ జేర్చెద. పాపకార్యార్జితంబులగు విత్తములు విషంబులుంబోలె ననుభోక్తలం జెఱుచు.

హేమ—భాగురాయణా! పుళిందరాజు మన్నెదొరలయెడ నెట్టి శౌర్య మధర్మములకైనదా? అది మన కుపకారము కాదా?

మంత్రి—దేవా! అది శౌర్యమనుట శూరుల నవమానించుట. చూడుఁడు.

తే. గీ. చేవగలవని గర్వించి లావుజేసి
యవనిపతులను గిల్లి కయ్యములు దెచ్చి
పోరి, తద్రాజ్యసంపద లప్పుడికి గొనుట
చౌర్యమగుఁ గ్రౌర్యమగుఁ గాని శౌర్య మగునె. 32

హేమ—అట్లయినఁ బుళిందుఁడు చేసినదోసముల నిరూపింపుము.

మంత్రి—అవధరింతురుగాక! సార్వభౌములగు దేవరవారి యాజ్ఞ బడయకయే మీ కరిగాఁపగు తాను, తన వలె నరిగాఁపులగు మన్నెదొరలను నిష్కారణంబుగ, నిర్భయంబుగ దండించి వారిదేశములు గొల్లఁగొనుట మీయనుజ్ఞఁ గొనక స్వతంత్రస్వీకారముఁ జేసికొనుట. చంద్రహాసుఁడను కొడుకు నీతఁడు పెంచుకొని పదునాలుగేండ్లయిన నామాట యింతకఱకు మీచెవిం బడినదా? అతఁ డెంతకైన సాహసికుఁడే. కానిచో నట్లూరకుండునా?

శా. ప్రీతి న్నాకతిఁగింపఁడయ్యె సరె నాపేరేమి యూరేమి స్వా
త్మోత్పత్తిస్థానము మీదివాణముగదా మన్నించి తాఁ జెప్పెనే,
మీతో నేమియు, నేల చెప్పఁ? కడిమి న్మున్నంటి వాఁ డుండఁగా
నీ తాటోటులు భక్తిలక్షణములౌనే మీయెడ న్భూవరా! 33

వచ్చినంతకలగన్నప్పుడు పెండలకడ మేలుకొనకలయు నన్నట్లు పుళిందుని విషయమున మన హేమతి యుండరాదు. ఏమనిన,



# చతురచంద్రహాసము.

## ద్వితీయాంకము.

—:(O):—

[అంతట మందకుఁ డను సేవకుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

మంద—(తనలో) తే. గీ. ఏయావేళ నిరంతరమునుఁ బాఱుచుండు
గాలివోలె నెల్లప్పుడుఁ గదలుచుండు
ధరణిరీతి దెబ్బలనుఁ దినుచుండు
క్షణము విశ్రాంతి నెఱుఁగఁడు గడి ఘటుండు.

నా తలలో జెల యీరీతిగ్లు యజమానుని మనస్సులో, సేవకులనిను త్రిము పను లెఱుఁగక యూరకయే యుందురు. సేవకులు, నోరు జ్ఞానముఁగల మనుష్యులయ్యు నెద్దులు మొదలగు జంతువులట్లె, భారమని యెఱుఁగక, నొప్పియని మొఱపెట్టక సేవ సేయవలయును. ఎవరిఁ గొలిచినైన సుఖము వదేయవచ్చును గాని దుష్టబుద్ధి యను సార్థక నామ మొందిన యీ భాగురాయణ మంత్రిని మెప్పించుట కష్టము. క్షణముక్రిందట నన్నుఁ బిలిచి, దేవమిహిరుఁడను తన జోస్యునిఁ బిలువుమని యానతిచ్చె. ఆయనఁ బిలిచి వచ్చినతోడనే సేనాపతియగు సుగ్రసేనునిం బిలువుమనియె. ఆయనఁ దెచ్చిన పిదపఁ దనకూఁతు పరిచారికయగు కాంచనమాలం దోడ్కొని రమ్మనియె. ఆమె యెందున్నదో వెదకి తీసికొనిపోవలయు. అందఱు మనుష్యులవంటి కరచరణములేగాని నావి యినుపచేతులు నినుప కాళ్ళుం గావుకదా. అందుచే నా యలసట తీఱువఱకు నొక్క నిముస మీ చెట్టుక్రిందఁ గూర్చుండి, పిదపఁ గాంచనమాలం బిలువఁబోయెద. (అని చతికిలఁబడి ముందుకుఁ జూచి) అమ్మయ్య! నా యదృష్టము మంచిది. కొంతసేపు నాకు వినోదముగాఁ బ్రొద్దు జరుగుటకు నా తోడిసేవకుఁడగు శౌనకుఁ డిటు వచ్చుచున్నాఁడు.

[అంతట శౌనకుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

శౌన—(తనలో) హరిహరీ! నా పాపకర్మ మేమోకాని యెన్ని దానములిచ్చిన నెన్ని శాంతులుచేసిన నా గ్రహాచారస్థితి బాగుపడినది కాదుగదా. గొప్ప జోస్యుల

వద్దకు నన్ను( దీసికొనిపోయి నాకు(గల కీడుల( దొల(గించునట్టి పుణ్యాత్ము( డెవ(డయిన( గల(డా ? దీనికై నే నెవ్వరి నాశ్రయింతు. (అని నలుదెసల( జూచి) ఇదిగో మా మందరు(డు కొండముచ్చులాగున నిచ్చటనే కూర్చున్నా(డు. ఈతని నాలోచన నడిగెద. (అని వానికడకు( బోవుచున్నా(డు.)

మంద—శౌనకా ! నీవేదో యాలోచించుచున్నట్లున్నావే?

శౌన—మందరా ! నామిత్రుడీ ! నాగ్రహచారస్థితి బొత్తిగ బాగుండలేదు. ఉదయమున లేచినది మొదలు రాత్రి పండుకొనువఱకు యజమానునిచేత( దల వాచునట్లు చీవాట్లేకద. మాటిమాటికి( బొంగుపోట్లేకద. ప్రతినిమసము దౌడ పగులునట్లు చెంపకాయలేకద. అనుక్షణము తల చిల్లిపడునట్లు మొట్టికాయలేకద. ఈ యుపద్రవములు మానుపుకొనుటకు నట్టి గ్రహశాంతి( జేయవలయును. అది చేయింపగల గొప్ప జోస్యు నెవనినైన నాకు( జూపగలవా ? నీ విమ్మన్నంత డబ్బో పప్పో చేసి యాయనకు సమర్పించుకొనియెద.

మంద—ఎవరో జోస్యు( డెందుకు ? నేనును జ్యోతిశ్శాస్త్రములో( గొంచెము వేలు పెట్టినవా(డనే. నీకు( గావలసినది నేనే చెప్ప(గలను. ఏ మడిగెదవో యడుగుము.

శౌన—ఇదిగో నడుగుచున్నా(డను. నాజాతకమును( జూచి, రోగములు, గ్రహచారములు, రాసులు, దశలు, ఫలములు, గ్రహశాంతివిధానములు( జెప్పవలయును.

మంద—జాతకము చూడనక్కఱలేదు. నీజన్మనక్షత్రము( జెప్పినం జాలును. దానిబట్టియే చెప్పవచ్చును.

శౌన—నాజన్మనక్షత్రము ధనిష్ఠ.

మంద—ఓహో ! ధనిష్ఠా నక్షత్రములో( బుట్టితివా ? సరే. జాతకప్రభావము వినుము. నీకు శాశ్వతమైన యోగము మంత్రిగారి నియోగము. తప్పుచేసినప్పుడు దండప్రయోగము. జీతము సరిగా(గోయుటచేత నప్పుడప్పుడు ధనవియోగము. తక్కిన యోగము లవయోగములే. నీగ్రహములు మంత్రిగారి యాగ్రహములు. నిగ్రహములు. అనుగ్రహములు సున్న. నీ రాశి పూటపూటకు( బెద్ద కుంభరాశి. దానిలో( గలియుచుగ మానరాశి చేరుచుండును. దశలు దుర్దశలు. అవస్థలు దురవస్థలు. ఫలములు నిష్ఫలములు. నీజాతకమునందలి కోణములు చీ(కటి కోణములు. నీ జాతకచక్రము మనసులో వేసికొనిచూడ(గా బండిచక్రమువలె నున్నది.

శౌన—ఔరా! ఎంత సరిగాఁ జెప్పితివిరా. ప్రస్తుతము నా జాతకము నీవు చెప్పినట్లే మిక్కిలి పాడుగా నున్నది. జ్యోతిశ్శాస్త్రములో నీవెంత గొప్పవాఁడవురా! ఇంతవాఁడవని యెన్నఁడెఱుఁగనే. ఇదివఱకెందఱో జోస్యులు నాగ్రహచారములఁ జెప్పిరికాని యింతచక్కగాఁ జెప్పినవారులేరు. ఒక జోస్యుఁడు నాకు శని చాలఁడన్నాఁడు. ఏలినాటిశని యఁట. ఇప్పుడు నాకు శని యెన్నింట నున్నాఁడు?

మంద—ఎన్నింట నననేల? అన్నింట నున్నాఁడు. ఆ జోస్యుఁడు నీకిప్పుడున్న శని చాలఁడన్నాఁడా? ఇంక నెక్కువ శని కావలయునా? నీకన్న నెవ్వరి కెక్కువగా నున్నాఁడు శని? నీది యేలినాటిశని కాదు. ఆలినోటిశని; బిడ్డలనోటిశని. ఏమన, నింటనున్న బియ్యము, కందులు మొదలగునవి కసువుగ నీయాలుబిడ్డలు తినకుండ గ్రహచారములు చెప్ప టక్కరిబ్రాహ్మణుని యొడిలోఁ బోయుచుందువు.

శౌన—బ్రాహ్మణుల కిచ్చినదానములు వ్యర్థము గాఁబోవు. ఎప్పటికైన గ్రహములు చక్కఁబడును. నీ ప్రల్లదపుమాటల కేమిగాని. నాజాతకము నాలుగైదేండ్లలో యోగించుననియు, నాకు వాహనప్రాప్తి గలుగుననియు నొకజోస్యుఁడు చెప్పినాఁడు. అది నిజమేమో చూడ.

మంద—అట్లుచెప్పిన జోస్యునకు నీ వేమిచ్చితివి?

శౌన—నా వెండికడియము లమ్మి యొకవరహా సొమ్మాతనిచేతిలోఁ బెట్టితిని.

మంద—అయ్యో! నిష్కారణముగా సొమ్ము పాడుచేసితివి. సొమ్ము పుచ్చుకొనకుండ నీ మాట నేనే చెప్పియుందును. ఏది యబద్ధమైనఁగావచ్చునుగాని యీమాట యబద్ధము కాదు. నీకిప్పు డేఁబదియైదేండ్లున్నవికదా. ఇఁక నాలుగైదేండ్లలో నీకు వాహనయోగము పట్టవచ్చును. ఏకాకట్లపల్లకిలో నిన్నుఁ బండుకొనఁబెట్టి మే మందఱము "వోంవోం, వోంవోం" అని మోసికొనిపోవుదుము. అప్పుడీ యూరికి దక్షిణమున రెండుపుల్లకట్టలతో నొక్క వెలుఁగు వెలుఁగుదువు. నీ కాయోగము పట్టెనా యిఁక మంత్రిగారికి నీదర్శనమే కాదు. ఒకరికొలువు నీవు చేయనక్కఱలేదు.

శౌన—చదువుకొన్న వాళ్ళకున్న తెగులేయిది. సరిగాఁజెప్పక యడ్డదిడ్డముగాను వెకాకోళముగాను మాటలాడుదురు. నీ యెగతాళి క్షణముకట్టిపెట్టి నాకు శని యెప్పుడు విడుగడయయిపోవునో చెప్పు.

మంద—నీ కొంపకు నీవే శని. నీ శని నీతోనే పోవును.

శౌన—ఛీ! ఇఁక నీతో మాటలాడఁగూడదు. మొదట తిన్నగాఁ జెప్పితివికాని యిప్పు డెగతాళి మొదలుపెట్టితివి. (అని పోఁబోవును.)

మంద—(చేయిపట్టుకొని యాఁపి) తాతా! నే నొక్కమాట చెప్పెద వినుము.

స్వప్న, శకున, సాముద్రిక, జ్యోతిశ్శాస్త్రములు బూటకములు. బ్రాహ్మణులకు బ్రతుకుఁదెరవులు. పాపనవాం డ్రీశాస్త్రముల యాధారమున మూర్ఖుల బెల్లించుకొని డబ్బులాగుచుందురు. వసిష్ఠునికన్న గొప్పజ్యోతిష్యుఁడెవఁడు ? శ్రీరామపట్టాభిషేకమున కాయన పెట్టిన ముహూర్త మెంత చక్కఁగా నెరవేరినదో యెఱుఁగవా? ఇట్టివనేకములు కలవు. కావున జోస్యులమాటనమ్మి చెడక, యున్న డబ్బు నీయాలుబిడ్డలకే పెట్టికొనుము. నీ పొరపాటులకు నీ తెలివితక్కువయే కారణముకాని గ్రహచారము కాదు. అప్పుడప్పుడు మిడతంభొట్లశకునములవలె జోస్యులపలుకులు కొన్ని చెప్పినట్లు జరుగును. వానిం బట్టి మనము మోసపోఁగూడదు.

శౌన—ఓరినాస్తికుఁడా! నీ చదువు తగులఁబెట్ట. ఇదియా నీ చదువు? రాజుగారికి, మంత్రిగారికి జ్యోతిశ్శాస్త్రమం దెంతో నమ్మకము. వారికంటెను గొప్పవాఁడవా? అందుకే మిడిమిడిజ్ఞానము పనికిరాదందురు. బ్రాహ్మణులమాట లబద్ధములైనచో వారు చెప్పినట్లు గ్రహణము లేలపట్టుచున్నవి? తెలియనివాఁడవు తెలియనట్లుండక యీ ప్రగల్భము లెందుకురా ? పార్వతీశాపమున నెప్పుడైన నొకటిరెండుసంగతులు, చెప్పినట్లు జరగకపోవచ్చునుగాని శాస్త్రమే యబద్ధమా? ఛీ! పశువా! నీ మొగముచూడఁగూడదు. శాస్త్రమును, బ్రాహ్మణులను దూషించినందుకు నీపాపము నిన్నే కొట్టును. (అని కోపగించి పోవుచున్నాఁడు.)

మంచి—(తనలో) ఆహాహా ! మూర్ఖులఁ బ్రబోధింపఁ బ్రయత్నించుట యిసుక జక్కెరఁజేయఁ బ్రయత్నించుట. మంత్రిగారికి జ్యోతిశ్శాస్త్రమునందు నమ్మకమెందు. నే నిట్లుపలికితినని యీనిర్భాగ్యుఁ డాయనతోఁ జెప్పెనా, నా కొలువు పడిపోవును. నే నెదుట నున్నప్పుడు శౌనకుఁడు సాహసించి మంత్రిగారితో నామీఁదఁ గొండెములు చెప్పలేఁడు. అందుచేత నే నిప్పుడేపోయి కాంచనమాలం బిలిచి, మంత్రిసన్నిధినుండెద. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

ఇది విష్కంభము.

---

స్థలము:—మంత్రిమందిరములోని నొకగది.

---

[అప్పుడు మంత్రి ప్రవేశించుచున్నాఁడు]

మంత్రి—(తనలో) ఆహాహా ! అన్యతమమహత్త్వ మెక్కఁడు కొనియాడఁగలఁడు.

చ. అనితరలంఘ్యమైన విపదంబుధి దాఁటఁగ నావ యేది, భీ
జనసముదాయమందు ఘనరక్షకవచం బెది, మిత్రి మదేశి సేవకున్

ధనికిఁ, గృపాణికన్న నిశితంబగు నాయుధమేది శత్రుసా
ధనముల యందు, నట్టి యనృతంబునకు న్నదివేల దండముల్.

ఏదానికి మంత్రులు మొదలగు లౌకికుల మనస్సులు వాసభవనంబులో, యేదానికి వణిజుల నాలుకలు స్వేచ్ఛగా గమనాగమనముల కనుకూలంబగు రాచబాటలో, యెయ్యది రాజులకు బలంబులనెల్ల మించిన మూలబలంబో, యెయ్యది రాజనీతికిఁ బ్రాణమో, యెయ్యది ఖడ్గాది సాధనంబులుఁ బలెను, నారాయణాది మహాస్త్రంబులుం బలెను స్థలకాల పరిజ్ఞానముఁ గలిగి ప్రయోగించువాని కౌశలంబునుఁబట్టి యమోఘమై విజయంబు సంఘటించునో, యేదాని ప్రయోగసంధానంబునం గుశలతలేమి హరిశ్చంద్రునకుఁ జండాలసేవయు, బలికిఁ బ్రియాపుత్ర సామ్రాజ్యభ్రష్టతయు, దశాననకంకాలచూర్ణంబును సంభవించెనో, యెద్దానియందుఁ బ్రయోగనైపుణ్యము లేదుగుటచే యుధిష్ఠిరునకు ద్రోణాచార్య మరణ మూలకంబుగను శ్రీకృష్ణునకు హంస డిభిక నాశన మూలకంబుగను మనోరథసిద్ధి చేకూరెనో, యట్టి యసత్యము జగద్గేయమై, ఫల ప్రదాయకమై వర్ధిల్లుఁగాక! ఇతర దేవతలుపాసించువారికి వశ్యులౌనవచ్చు. మానవచ్చు. కాని యనృతదేవత సమర్థముగా నుపాసింపఁబడునేని వరము ప్రసాదింపక పోదు. యథావిధిగా సేవింపనేరని వారి నీ దేవత యెదురు తిరిగి, నెత్తిన వంచి త్రొక్కుచున్నను. చిన్ననాఁటనుండియు నాకుఁ దోడునీడయై యుండి యిప్పటికిని కళంక దూరగు మొలంగుచుఁ గార్యసిద్ధిఁ జేయుచున్న దీ దేవతయే కదా. నేఁడు నా వాక్కునిలిచి పులిందునిపైఁ గుంతలేంద్రున కాగ్రహంబుఁ దెప్పించి చందనావతీపురప్రయాణమునకు నాకు రాజానుజ్ఞ నిప్పించిన దీ దేవతయే కదా. ఓ జగదుపకారిణి! ఓ జగన్మోహిని! ఓ యాపద్బాంధవి! ఓ విశ్వవ్యాపిని!

చ. మనుజులు సత్యమే యని భ్రమంపడ మోహనమైన మూర్తి దా
ల్చి, నరుని నాల్కకున్ స్వాఁటు సేయక బ్రాఁకులనోలెఁ దివ్యమై
ధనములు గూర్తు, సౌఖ్యములఁ దార్తు, విపత్తు వారింప నేర్తు నో
యనృతమ! నీవు చేసెడి సహాయము లెల్లియుఁ జేయ లేరుగా. 2

నీవు సర్వదా మాకు జయము నొసఁగూర్తువుగాక!

[అప్పుడు మందరుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

మంద—జయము జయము దేవా! దర్శనార్థము దేవమిత్రులవారు వచ్చినారు.

మంత్రి—తత్క్షణము వారిని దోడ్కొని రమ్ము.

మంద—చిత్తము (అని పోయి తోడ్కొని వచ్చి) స్వామీ! వీరె వచ్చినారు.

మంత్రి—ఆర్యా! ప్రణామము చేయుచున్నాఁడను. ఈ పీఠ మలంకరింపుఁడు. మందరా! ద్వారముకడ నుండుము.

భయంబున ముప్పదియైదేండ్ల వయసుండునట్లు తనజాతకమును మార్చుమని నన్నుఁ బ్రార్థింప నేనవలీలగా నట్లు వ్రాసియిచ్చితిని. ఇప్పుడున్న మీపినతల్లి నే వ్రాసిన జాతకమునుఁబట్టి పెండ్లి సేయఁబడినదియే. పాప మాయన వివాహానంతరము కొద్దికాలములోనే స్వర్గస్థుఁడయినను మృతినొందు వఱకు నాయందుఁ బుత్త్రప్రేమ గలిగియుండెను.

మంత్రి—అవును. వినియుంటిని. అందుచేతనే నాతనయుని జాతకము మార్చుమని మిమ్ముఁ బ్రార్థించితిని. మిహిరవంశమునకును మాకుటుంబమునకును సంబంధము నిన్నటిదా! నేఁటిదా! మాపితృపితామహులకు మీ పితృపితామహు లాశ్రితులై, మిత్త్రులై సర్వకార్యములఁ దోడ్పడుచు వచ్చిరి. ఎంతెంత రహస్యములు మీపెద్దల చెవులం బడినవి కడుపులలో జీర్ణములగుచు వచ్చునే కాని వెలికివచ్చి యెఱుంగవు. ఆహా! రహస్యములు వెలిపుచ్చుట మీ యింటనొంట లేదుగదా. అట్టిసుగుణ సంపదగల వేదస్వరూపుల కులదీపకులగు మిమ్ము మఱియొక యర్థముఁ బ్రార్థించెద. ఈవఱకు నాకొనర్చిన మేలునకే నా మేనిచర్మము గోసి యిచ్చినను మీఋణము తీఱదు.

దేవ—దేవా! నన్నింత పొగడవలయునా? నన్నుఁ బోషించుభారము మీది. మీపనుపులు శిరసావహించిచేయువిధి నాది.

మంత్రి—ఆర్యా! అవధరింపుఁడు. మన మహారాజుగారికి నిజతపఃఫలమని చెప్పఁదగిన పుత్త్రిక చంపకమాలిని కలదుగదా. జనకుఁడామెనిమిత్త మనుకూలవరుని వెదకుచు రాజకుమారుల జాతకములన్నియుఁ బరీక్షింప నుద్యుక్తుఁడయియున్నాఁడు. ఆస్థానదైవజ్ఞులగుటంజేసి, మహారాజుగారు జాతకపరీక్షయందు మిమ్మే నియోగింతురు. అప్పుడేసందర్భమునందో యిప్పుడు మీరు నిర్మించిన మా మదనుని క్రొత్తజాతకమును మహారాజుగారికిఁ జూపి గ్రహముల యుచ్చస్థితియు, జాతకప్రభావంబును వేయి నోళ్లం బొగడి, యున్న యుత్కృష్టగ్రహములు మఱియొక జాతకమునఁ గూడియుండుట యరిదియని నొక్కి వక్కాణించి, యాయనమనసు విఱిచి యావిభుండు తనముద్దుకూఁతు నా పుత్త్రునకిచ్చునట్లు, రాజ్యంబు నావంశంబున నిలుచునట్లు, మీరువ్రాసిన జాతకము సఫలమగునట్లు, కడుచమత్కృతితో, బుద్ధిసూక్ష్మతతోఁ సమయమెఱిఁగి చేయవలయు. ఈ మహోపకారమునకుఁ బ్రత్యుపకారము చేయఁగలనని గర్వోక్తులు పలుకఁజాలను గాని నా సలుపఁదలఁచిన దించుక వినుండు. మహారాజుగారిచేత, రాఁబోవు సూర్యగ్రహణమునాఁడు మూడగ్రహారములు పుత్త్రపౌత్త్రపారంపర్యము జరగునట్లు మీకిప్పించెద. మీకాయెత్తు ధనము కుప్పవోసి నే నిచ్చెద. ఇఁక గుఱ్ఱములు పల్లకులు కావలసినన్ని కదా. పరోపకారపరాయణులగు మీరు కార్యసంఘటనమునం దెట్టి బహుమానముల కాసపడరని నే నెఱుంగుదును, మాకుటుంబముమీఁదనున్న యభిమానముచేతనే మీరు చేయుదురు. వేయు చెప్పనేల. కార్యభార మిఁక మీదే.

దేవ—అమాత్యమణీ! నీ సంకల్పము నిశ్చయముగా నెఱవేఱినదని నమ్ముము. గుణవంతుఁడగు నీ కుమారునిఁగూర్చి యొకఁడు ప్రశంసింప వలయునా?

చ. మదనుఁడు, రూపరేఖ మహిమంబున నాకృతిఁ దాల్చివచ్చె న
మ్మదనుఁడు, తేజమందు నసమానుఁడు, సౌభాగ్యత నద్వితీయుఁడౌ,
జనువుల పోఁడిమిం దలఁప శ్రీస్థలిపై మగరూపుఁగొన్న శా
రదగద, వాని కేమిటి కీయంత నృపాలుని యల్లుఁడౌటకున్. 4

మంత్రి—నాకొడుకగుటయే కొఱంత. దూరపుఁగొండలు నునుపన్నట్టితరరాజ నందనులు సౌభాగ్యులట్ల కనపడుదురు.

దేవ—సరే. నా ప్రయత్నములవలన దగ్గఱకొండలే నునుపులగుఁగాక! ఇఁక నాకు సెలవొసంగుఁడు. (అని లేచుచున్నాఁడు)

మంత్రి—చిత్తము. ఇది మీ కార్యము గాని నాకార్యముగాదు.

దేవ—(నిష్క్రమించుచున్నాఁడు.)

మంత్రి—(తనలో) నేను చందనాపత్రికిఁ బోవునాఁపలఁ జేయఁదలఁపెట్టిన కార్యములలో నొకటి యైనదికదా. తక్కినవికూడ నిట్లే నెఱవేఱునా! ఏల నెఱవేఱకుండు. సాముకస్తుతిని యున్న మనుష్యులు ప్రపంచమున నున్నంతకాలము కార్యసాధనము చేతిలోనిదే. పరమనిష్ఠాగరిష్ఠుఁడని, వేదాంతియని పేరువడిన యీ బ్రాహ్మణునిచేత నా కార్యమును, మైత్రీ, విశ్వాసము మున్నగునవి చేయింపఁగలవో లేవో చెప్పలేను గాని, మూఁడగ్రహారములు తప్పక చేయించితీరునని ధైర్యముతోఁ జెప్పఁగలను. ఏలయన,

తే. గీ. ఆత్మశుద్ధిమహాగ్నికి నంబుదంబు
విమలనిత్యమహాభూజమునకు వేరుపుత్తు
ఆస యనియెడు బెబ్బులి కామిషంబు
లంచ సుది ఘటింపని పనుల్గలుగ వెందు.

ఆదియునుఁగాక,

క. మంచిలేసంబులు నీతులు
నంచిత వేదాంతబోధ లాచారంబుల్
కాంచనరాశియు, రూకల
సంచులు కంటఁబడువఱకె జనులకు నిలుచున్

మందరుఁడు—(ప్రవేశించి) దేవా! ఉగ్రసేనులు దయచేసినారు.

మంత్రి—(చూచి) మిత్రమా! ఉగ్రసేనా! రమ్ము. మందరా! ద్వారముకడ నుండుము.

మంత్రి—ఆ యుపమానము సరికాదు. నా పలుకులు వినుము. కలదుగదా నాకు విమల యను కూఁతురు. వేదాంతవిమర్శవిచారము చేయుచుండ నాకుఁ బుత్రికా జనన మయ్యెనని శుభవార్త తెలియుటంజేసి యామెకు బ్రహ్మవిమల యను పేరు పెట్టితిని. ఆమె యిప్పుడు సంప్రాప్తయౌవన యైనది. ఎంతెంత చక్కఁదనంపుటిక్కలనైనఁ జేతిమాఁట నొల్లని రాజనందనులు నా బిడ్డ నిమ్మని నోరుజాచి స్వయముగ నడిగియు, సందేశముమీఁద సందేశముంపియుఁ బ్రార్థించుచున్నారు.

ఉగ్ర—పండున్నప్పుడు చిలుకలు మూఁగవా?

మంత్రి—బాలిక విద్యావతియు, యుక్తవయస్కయు, సదసద్వివేకశాలినియు నగుటంజేసి వరనిర్ణయవిషయమున స్వాతంత్ర్య మామెకే యిచ్చితిని. ఏలయన,

ఉ. ఎవ్వని మెచ్చునో పడఁతి యెవ్వనికిన్ హృదయంబు నిచ్చునో
యవ్వఁడు గోర్కెఁ గావలయు నంతియ కాని తదన్యుఁ గూర్చుచో
నవ్వనజాక్షికిన్ మతికి హాయిగఁ గాఁపుర మెప్పుడెప్పుడున్
మర్వఁపు గొమ్మసంపఁగికి మైత్రి ఘటిల్లునె తేఁటితోడుతన్

ఉగ్ర—ఆమె స్వాతంత్ర్యము నుపయోగించుకొని తగు వరు నెన్నుకొనినదా?

మంత్రి—ఎన్నుకొనినది. కాని, పురుషుఁడు దుర్లభుఁడు.

ఉగ్రి—పురుషుఁడు దుర్లభుఁడా?

క. ఎవఁడా [illegible]హీనుం
డెవఁడా బాలిశుఁడు గాఁడెవ్వఁడు, సిరి రాఁ
దివ్వఁగ మోఁకా లొడ్డఁడు
నవినీతుఁడు కలఁడే సాక్షి లేదని నిక్కముగాన్.

పాపము! తే. గీ. మంచి యొజ్జాగుఁడు కాఁబోలు నుదతి నెన్నఁ
దలఁచుఁ; జూచినా వలదంట కలని తరమె
యటఁడు కలవన్నఁ గాముఁ డేనుగును? కాముఁ
డ రసన్నను శిరితూపు లూఁగకున్నె?

ఆ దుర్లభుఁ డెవఁడో యెందున్నవాఁడో తెలుపుమనేని నే నెట్టి శ్రమకైన నోర్చి యాతని సులభునిఁ జేసి మీకడకుఁ దోడ్తెచ్చెద.

మంత్రి—(చిఱునవ్వుతో) నీవు దూర మేఁగ నక్కఱలేదు. అతఁడీపురముననే యున్నాఁడు.

ఉగ్ర—ఈపురముననే యున్నాఁడా? ఆ మహాత్ము నే నెఱుఁగుదునా?

మంత్రి—నిన్ను నీ వెఱుఁగుదువేని వానిఁగూడ నెఱుఁగుదువు.

ఉగ్ర—అతఁ డిప్పటికి నా మనోగోచరుఁడు కాలేదు. ఇప్పు డెందున్న వాఁడు?

మంత్రి—(నవ్వుచు) ఇప్పుడు నా సమక్షమందే యున్నాఁడు.

ఉగ్ర—(తనలో) ఏమి? ఆ యదృష్టవంతుఁడను నేనే యగుదునా? (పైకి) మీ సమక్షమున నున్న యతఁడు దుర్లభుఁడు కాఁడు.

మంత్రి—ఉగ్రసేనా! ఇఁక సందిగ్ధవచనములతోఁ బ్రయోజనమేమి? ఇటు వినుము. మా విషయ యొక్క నాఁడు సాయంకాలమున మేడమీఁది గవాక్షమునుండి స్వారికేఁగు నిన్నుఁ జూచెనఁట. చూచి, నీ నామధేయాదులు చెలికత్తెలవలన విని వలవంతఁ దగిలెనఁట. తగిలిననాటంగోలె యిట్లున్నదని సఖులు నాకెఱిఁగించిరి.

శా. నీ నామంబె జపించు, నీ సొగసె వర్ణించు న్సఖుల్ చేలు, నీ
జ్ఞానంబే కొనియాడు నీ జయములే శ్లాఘించు, నీ గాథలే
వీనుల్ పండగ వినును ల్లాలుపు, నీ విక్రాంతిరే మెచ్చు, నే
భూనాథు న్దలపెట్టనీయదఁట, యా మోహం బదేమో కదా.

అందుచే నీ వా బాలికం జేపట్టి యామెకును నాకును మనోరథసిద్ధిఁ జేయఁ బ్రార్థింపుచున్నాఁడ.

ఉగ్ర—(లేచి సంతోషముతో) ధన్యోస్మి! ధన్యోస్మి! దీనికి మీరు నన్నుఁ బ్రార్థింప వలయునా? మీ కల్లుఁడ నగుటకన్న నాకు మహాభాగ్యము కలదే? ఇది నాకు బహుతపఃఫలము. బహుజన్మసుకృతఫలము. కోటానకోటులు ధనము వ్యయము చేసినను, మహీమండలంబంతయు నొలిగా నిచ్చినను నే కన్యాలలామహస్తంబు దుర్లభంబో, యా సుందరి నా కప్రయత్నముగ లభించు చున్నది. చిరకాలమునుండి యా మోహనాంగిపై వలపు నిలిపి, నా కామె నిమ్మని యడుగుటకు సాహసము లేక మిమ్ము నడుగఁదలఁచి యీ లబ్ధమనోరథునుఁడఁ గాకపోవుదు నేమో యని మనమున శంకించుచుంటిని. ఇపుడు నా భాగ్యము పండె. జన్మము ధన్యమయ్యె. కులము వన్నెకెక్కె. ఇఁక నేను మీ దాసుఁడ.

క. మెలఁగెద నీ కనుసన్నల
నిలిపెద నీ యాన మాళి, నీ చరణములేఁ
గొలిచెద, నిఁక నా ప్రాణం
బులు నీయవి, నా శరీరమును నీయదియే.

మంత్రి—(తనలో) నా తలంచిన మోహనాసము వీని తలకెక్కినది. ఈతిక్క తిరుగకుండఁ మతియొక్క రసము గ్రుక్కెడు త్రాగించెద. (ప్రకాశముగా) ఆయుష్మం

